Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ ఆగస్టు నెల 29 వ తేది శుక్రవారం [నెం 24 రు

## రెండు యేండ్లలో యుద్ధగమనం.

### బ్రిటను, రష్యా, అమెరికాల నెదిరించిన జర్మనీ ఓడక తప్పదు.

జర్మనీ ఈ మహా యుద్ధమును ప్రారంభించి రెండేళ్లు అయినది. 1939 వ సం॥ సెప్టంబరు 1 వ తేదీన తెలతెల వారు వేళ, జర్మను సైన్యములు తమ దేశమునకు తూర్పు పొలిమేరయందున్న, పోలండు అను చిన్న రాజ్యముపైకి దాడి ప్రారంభించెను. పోలండుపై శత్రు లెవరైన దాడి వచ్చినయెడల, తాము పోలండుకు సహాయము వచ్చెదమని ఫ్రాన్సుదేశమును, ఆంగ్ల దేశమును, అంతకు పూర్వము ఒడంబడికను గావించుకొనియుండెను. ఆయొడంబడిక షరతుల ప్రకారము, ఫ్రెంచి, బ్రిటిషు ప్రభుత్వములు పోలండుకు సహాయమొనర్చి కాపాడుటకుగాను, జర్మనీపై తాముగూడ యుద్ధము ప్రకటింపవలసివచ్చెను.

జర్మనులు అపారమగు సైనికబలమును, మారణ యంత్ర సాధనములను, విమానములను ఒక్కుమ్మడిగ ప్రయోగించి 18 రోజులలో పోలండు దేశమున సగము వరకు ఆక్రమించెను. ఆసమయమున, పోలండునకు తూర్పుననున్న రష్యా ప్రభుత్వము తూర్పు వైపునుండి ఆకస్మికముగ పోలండుపైన సైన్యములను నడిపి ఆక్రమించుటకు ప్రారంభించెను; ఆరెండు దేశముల మధ్యను చిక్కుకొని పోలండు దేశము శిథిలమై శత్రువుచే పూర్తిగ ఆక్రమింపబడెను. దానితోనే రష్యాకును జర్మనీకిని మధ్య ఉమ్మడి సరిహద్దు గూడ యేర్పడెను.

రష్యా చాల పెద్ద దేశము. పడమట జర్మనీ సరిహద్దు నుండి తూర్పున జపాను వరకును వ్యాపించియున్నది. ఉత్తరమున, ఉత్తర ధృవప్రాంతమునుండి దక్షిణమున భారతదేశ సరిహద్దులవరకును వ్యాపించియున్నది. జర్మనీ పోలండును ఆక్రమించినతరువాత, భారతదేశపు వాయువ్య సరిహద్దుల నుండి చూచినచో, జర్మనీ భారతదేశములకు మధ్య ఒక్క రష్యాయే అడ్డముగనున్నది. మరికొంత భాగమున రష్యాకు దోడు ఆఫ్ఘనుస్థాను, పర్షియా దేశములుగూడ అడ్డముగ నున్నవి.

పోలండు ఆక్రమించిన పిదప ఆరు నెలలకాలము జర్మనీ, మరేదేశముపైనను దాడి సాగింపలేదు. ఫ్రెంచి సరిహద్దులలో ఒక వైపున జర్మను సైన్యములును మరియొక వైపున ఫ్రెంచి బ్రిటిషు సైన్యములును నిలచి పరస్పరము తమ బలముల పట్టి చూచుకొనుచుండెను. ఉభయములకు, గస్తీ దళముల సంఘర్షణలు దప్ప పెద్ద పోరాటము లెవ్వియు జరుగలేదు. ఈ యారు నెలలో జర్మనీ, తన ఆయుధ సామగ్రిని హెచ్చించుకొనుచు, రహస్యముగ సన్నద్ధమగుచుండెను.

### డెన్మార్కు నార్వేలపై దాడి.

యుద్ధ వ్యవహారము లటులమందముగనుండగా హిట్లరు, ఏప్రిలు 8 వ తేది రాత్రి తన సైన్యములను, జర్మనీకి పడమటి సరిహద్దులందున్న డెన్మార్కు దేశముపైకిని, ఈశాన్య దిశగానున్న నార్వే పైకిని ఆకస్మికముగ దాడి సాగించెను. డెన్మార్కు ప్రభుత్వము ఈ దాడిని ప్రతిఘటింపకయే లొంగిపోయెను. అందుచే రెండు మూడు రోజులలో, జర్మను లాదేశమును పూర్తిగ ఆక్రమించుకొనగల్గిరి. నార్వే మాత్రమటుల గాక జర్మను దాడిని ప్రతిఘటించెను. కాని జర్మను వేగుల వారి కుట్రలవలనను, నార్వే ప్రజలలోనే కొందరు ద్రోహులై జర్మనులకు సహాయమొనర్చుటవలనను, యెక్కువ కాలము ప్రతిఘటింపజాలక పోయెను. 20 రోజులలో నార్వేను గూడ జర్మను లాక్రమించుకొన గల్గిరి. బ్రిటిషు ప్రభుత్వము నార్వేకు కొంత సైన్యమును సహాయమంపెను. ఈ సైన్యములు నార్వే దక్షిణభాగమునను, ఉత్తరమున నార్విక్కునందును దిగి, కొన్ని రోజులు జర్మనుల నెదిర్చి నిరోధించి పోరాడినవి. కాని జర్మనులు ముందుగవచ్చి అనుకూలమగు ప్రదేశములన్నిటిని ఆక్రమించుకొని యుండుటచే, బ్రిటిషు ప్రభుత్వము తన సైన్యములను నార్వే నుండి ఉపసంహరించుకొనవలసి వచ్చెను. కాని ఈ పోరాటమున బ్రిటిషు యుద్ధ నౌకలు జర్మను నౌకాదళమున ఇంచుమించు సగభాగమును సముద్రమున ముంచివేయగల్గెను.

నార్వే - డెన్మార్కులపై దురాక్రమణ పూర్తియైనదో, లేదో మే నెల 10 వ తేది అర్ధరాత్రివేళ జర్మనులు, ఆకస్మికముగ తమకు పడమటి పొలిమేరలయందున్న హాలండు, బెల్జియము దేశములను ఆక్రమించుటకు ప్రారంభించిరి. జర్మనీ అంతకు కొలది కాలము పూర్వమే, ఆరెండు దేశముల తోడను నిరాక్రమణ యొడంబడికనుగావించుకొని యుండెను. అందుచే జర్మనీ ఇట్టి ద్రోహమునకు, దురంతమునకు పాల్పడునని ఆ దేశములు తలంచియుండలేదు.

హాలండు సైన్యములు నాల్గు రోజులలోనే లొంగిపోవలసి వచ్చెను. బెల్జియము సైన్యములు మరి రెండు వారములు పోరాడి తుదకు మే 28 వ తేదిన అవిగూడ లొంగిపోవలసి వచ్చెను.

### ఫ్రాన్సు పతనము.

బెల్జియము, హాలండులకు సహాయము వచ్చిన ఫ్రెంచి సైన్యములును, బ్రిటిషు సైన్యములును మాత్రము జర్మనుల నిలువరించి పోరాటము సాగించుచుండిరి. కాని, జర్మను సైన్యములు, అరక్షితముగనున్న బెల్జియం - ఫ్రెంచి సరిహద్దులమీదుగా ఫ్రాన్సును ప్రవేశించి చీకాకు పరచెను. తుదకు, ప్రపంచములోకెల్ల బలవంతమైనదిగ పరిగణింపబడుచుండెడి ఫ్రెంచి సైన్యముగూడ శత్రుల నిలువరింపలేని స్థితి యేర్పడెను. అంతట ఫ్రెంచి ప్రభుత్వము - బ్రిటనుతో గావించుకొనిన ఏర్పాటుకు విరుద్ధముగ—బ్రిటనును వదలి, తాను ఒంటరిగా జర్మనీతో యుద్ధ విరామపు ఒడంబడికను గావించుకొని జూను 17 వ తేదికి యుద్ధము నుండివైదొలగిపోయెను. ఒక్క జర్మనీతోడనే పోరాటమైనచో ఫ్రాంసు అంత త్వరితముగ పడిపోయి యుండెడిది గాదు. కాని, యుద్ధమున ఫ్రాన్సు స్థితి విషమముగ నుండగనే, ఆగ్నేయ సరిహద్దున ఉన్న ఇటలీగూడ జూను 10 వ తేదిన ఫ్రాన్సుపై యుద్ధము ప్రకటించి దాడి సాగించుటచే వెనుకను ముందునుగూడ యుద్ధము సాగించుట కష్టమయ్యెను. ఫ్రాన్సు

జర్మనీతో యుద్ధవిరామపు ఒడంబడిక గావించుకొనినపుడే ఇటలీతోగూడ అదే విధముగ మరియొక యొడంబడిక నేర్పరుచుకొనెను.

## బ్రిటను కృత నిశ్చయము.

బలవంతమగు ఫ్రాన్సు ఈవిధముగ పడిపోయినను, బ్రిటను మాత్రము ఏమాత్రమును చలింపక జర్మనీ-ఇటలీలను పూర్తిగ నోడించి దురాక్రమణల నిర్మూలించుటకు తుదివరకు యుద్ధమును సాగించుటకే నిశ్చయించెను. తమ దేశములు శత్రు హస్తగతమగుటచే బ్రిటనుకు వచ్చిచేరిన నార్వే, హాలండు రాజులును పోలండు, జెకోస్లావేకియా, బెల్జియం ప్రభుత్వములును, స్వతంత్ర ఫ్రెంచి నాయకులును బ్రిటనుతో జేరి సంగ్రామమును సాగించుటకే నిశ్చయించిరి.

హిట్లరు తన సైనిక విమాన బలములచే బ్రిటనునుగూడ క్షణములో ఓడించి, 1941 వ సం॥ ఆగస్టు 15 వ తేదీకే లండను నగరమున ప్రవేశించి బ్రిటనుకు సంధి షరతులను ప్రకటింపవలెనని అనుకొనెను. అందుకుగాను లండను నగరముమీద, ఇతర బ్రిటిషు పట్నములమీద, పగలు బ్రహ్మాండమగు విమాన దాడులను జరుపుటకు ప్రారంభించెను. కాని, ఆగస్టు 15 వ తేదీనే బ్రిటను మీదకు వచ్చిన విమానములలో 180 జర్మను విమానములు ధ్వంసంచేయబడెను. ప్రతిదినం వందలకొలది విమానాలను కోల్పోవుచుండుటయే గాని ఫలితము లేకపోవుటచేత, ఇక బ్రిటనుపై దాడి సాధ్యం గాదని జర్మనులు ఆశ వదలుకొనిరి.

## బాల్కనులపై దాడి.

అంతట జర్మనీ తన దృష్టిని బాల్కను రాష్ట్రములవైపు త్రిప్పినది. వానిలో మొదట కుట్రలవలనను, ప్రచారము వలనను, రుమేనియాలో కలతలను కల్గించి, రక్షణయను పేరుతో హిట్లరు మెల్లగా రుమేనియాలో తన సైన్యముల ప్రవేశపెట్టి ఆక్రమించెను. రుమేనియాలో పేరునకు స్వతంత్ర ప్రభుత్వమున్నను, జర్మనీపై ఆధారపడి జర్మనుల చేతులలో కీలుబొమ్మగ నుండునట్లు చేసెను. పిమ్మట బల్గేరియాను గూడ అటులనే ఆక్రమించెను.

పడిపోయిన ఫ్రాన్సును పంచుకోడానికని యుద్ధం ముగిసిపోతున్నదను భావంతో గుంటనక్కలాగా యుద్ధంలో ప్రవేశించిన ఇటలీ, యుద్ధం ముగియలేదని తెలిసికొని, ఇక ఆఫ్రికా ఖండంలో బ్రిటనుకు తొందర కల్గించుటకు ప్రారంభించినది. ఫ్రాన్సు, బ్రిటను కలసి మధ్యధరా సముద్రప్రాంతమును ఆఫ్రికా ఖండమందలి తమ రాజ్యములను కాపాడుకొనుటకు అదివరకు ఏర్పరుచుకొన్నవి. ఇపుడు ఫ్రాన్సు వేరుగా శత్రువులతో ఒడంబడిక చేసుకొనుటచే ఆ ప్రాంతములలో బ్రిటిషు స్థితి క్లిష్టమయ్యెను. అందుచే ఇటాలియనులు దాడి వచ్చుటతోడనే బ్రిటిషు సైన్యములు బ్రిటిషు సోమలీ దేశమును ఖాళీచేసి వదలివేయవలసివచ్చెను.

## ఇటలీకి పరాభవం.

ఇటలీ, ఆఫ్రికాయందలి విజయగర్వముతో బాల్కనులయందలి గ్రీకు దేశమునుగూడ ఆక్రమింపవలెనను భావముతో అకస్మికముగ గ్రీసుపై బడెను. కాని గ్రీకులు అద్భుత ధైర్య పరాక్రమములతో ఇటాలియను దాడిని తిరుగగొట్టుటయే గాక, గ్రీకులే ఇటాలియను సైన్యములను అల్బేనియాలోకి తరుముకొనివచ్చి ఇటాలియను పరిపాలనయందున్న అల్బేనియానుగూడ ఆక్రమించుటకు ప్రారంభించిరి. తుదకు ఇటలీని సంపూర్ణ వినాశమునుండి కాపాడుటకు జర్మనీయే చేయి చేసుకొనవలసివచ్చెను. బాల్కనులలో యుగోస్లోవియాతో, జర్మనీ అంతకుకొలది రోజులు ముందుగనే నిరాక్రమణ, మైత్రి యొడంబడికలను గావించుకొనెను. కాని వానినన్నిటిని, చింపివేసి, అకస్మికముగ జర్మను సైన్యములు ఈ సంవత్సరము ఏప్రిల్ నెలలో యుగోస్లావియాపైనను, బల్గేరియాపైననుగూడ జర్మనులు దాడి సాగించిరి. అతిభయంకరమగు పోరాటము జరిగినపిదప ఒకటిన్నర మాసములకు ఆ రెండు రాష్ట్రములనుగూడ జర్మను లాక్రమించిరి.

## విజయరంభములు.

బ్రిటనుకును, మిత్రమండలికిని అంతవరకు దురదృష్టకరముగనున్న యుద్ధపరిస్థితులు, 1941 వ సంవత్సరారంభము నుండియు మారిపోయెను. ఆఫ్రికాయందలి ఈజిప్టుదేశమున బ్రిటనుకు స్వల్పముగనే సైన్యముండెను. ఈజిప్టునకు పడమరగ, ఇటాలియనుల లిబియా రాష్ట్రమును, తూర్పు ఇటాలియనుల ఎరిత్రియా, అబిసీనియా దేశములును గలవు. ఆ రెండు ప్రాంతములనుండి ఈజిప్టుపైకి దాడిసాగించి ఆక్రమింపవలెనని ఇటాలియనులుద్దేశించిరి. కాని, తమకు ఈజిప్టునందున్న సైన్యములు స్వల్పమేయైనను వానితోనే, బ్రిటిషు వారు లిబియాపై తామే డిసంబరు మాసమున దాడి ప్రారంభించిరి. ఫిబ్రవరి నెలసరికి లిబియాలో పడమటి ఇసుక యెడారి ప్రాంతమును తప్ప, ప్రధానమగు తూర్పు భాగమునంతను ఆక్రమించుకొనగలిగిరి. లిబియాలోని ఇటాలియను సైన్యమున 1,80,000 మంది ఖైదీలుగ పట్టుకొనబడిరి. అదిగాక, శత్రుల అపారమగు మందుగుండు సామగ్రియు వేలకొలది ఫిరంగులునుగూడ బ్రిటిషువారి చేతులలోబడెను. ఇటివలనే జర్మనులు, ఇటాలియనులకు సహాయముగవచ్చి, తిరిగి ఈజిప్టు సరిహద్దువరకును ఆ దేశమును ఆక్రమించుకొనగలిగిరి. కాని లిబియాలోని టోబ్రూకు రేవుదుర్గం ఇంకను బ్రిటిషు స్వాధీనంలోనే వున్నది. అచటనున్న బ్రిటిషు సైన్యం, శత్రు సైనిక దళములకు రాత్రింబగళ్లు తొందరగలిగించుచున్నది.

ఈ సమయముననే ఈజిప్టునుండియు, తూర్పున కెన్యా మొదలగు దేశములనుండియు బ్రిటిషు సైన్యములు, ఇటాలియనుల తూర్పు ఆఫ్రికా సామ్రాజ్యంమీద దాడుల సాగించెను. తూర్పు ఆఫ్రికాలో ఇటాలియనులకు నిలువనీడయైన లేకుండ పూర్తిగ ఆక్రమించెను. యెర్ర సముద్రము ద్వారా మధ్యధరా సముద్రములోనికి బ్రిటిషు నౌకలు స్వేచ్ఛగ రహదారి నుపయోగించుకొనుటకు వీలయ్యెను.

ఈ ఆఫ్రికా పోరాటములలో షుమారు 3 లక్షలకుపైగా ఇటాలియను సైనికులు ఖైదీలుగ పట్టుబడిరి. మరి రెండు లక్షలవరకు, క్షతగాత్రులయిరి. ఈపరాజయములతో ఇటలీ ఇంచుమించు శిథిలమై పోయినది. సహాయమనుపేర, జర్మను సైన్యములు ఇటలీనిగూడ ప్రవేశించి ఆక్రమించియున్నవి.

## ఈరాక్ సిరియాల ఆక్రమణ.

జర్మనులు, బ్రిటిషు సామ్రాజ్యమునకు తొందరకలిగించుటకుగాను, గత జూన్ మాసమున భారత దేశపు సరిహద్దులలోనున్న ఈరాక్‌నందును, దానికి పడమటగ మధ్యధరా సముద్రపు తూర్పు తీరమున, ఫ్రెంచివారి పాలనయందున్న సిరియాయందును ప్రవేశించుటకు కుట్రలు పన్నిరి. కాని బ్రిటిషు సామ్రాజ్య సైన్యములు వెంటనే ఈరాకులో ప్రవేశించి, అచట జర్మనుల తరపునకుట్రలుసాగించిన రషీదాలీని వెడలగొట్టి తామే ఆ దేశమును ఆక్రమించిరి. సిరియానుగూడ విషీ (ఫ్రెంచి) ప్రభుత్వమునుండి అటులనే స్వాధీనపరచుకొనిరి. జర్మనులు భారతదేశపు పడమటి సరిహద్దునందున్న ఈరాన్ (పర్షియా) యందుగూడ ఇట్టి కుట్రలనే సాగించుచుండుటచే ఈ ఆగస్టు 25 వ తేది ఉదయము బ్రిటిషు-రష్యా ప్రభుత్వములు ఉభయులును పర్షియా నాక్రమించి అచటనుండి జర్మనుల వెడలుగొట్టుటకు ప్రారంభించిరి.

## రష్యాపై దాడి.

వీని యన్నిటికంటెనుగూడ యుద్ధ పరిస్థితులను పూర్తిగ మిత్రమండలికి అనుకూలముగ మార్చివేసిన సంఘటన మింకొకటి జరిగెను. అది జర్మనీ జూన్ నెల 22 వ తేదిన అకస్మికముగ రష్యా దేశముపై యుద్ధము ప్రకటించి దాడి సాగించుట.

ఇరువది యేండ్లుగా, రష్యనులు, తమ దేశరక్షణకు అవసరమగు ఆయుధయంత్రము లన్నిటిని చేర్చిపెట్టుకొనుచుండిరి. రష్యాకు జర్మనీనిమించిన విమానబలము, సైనికబలము, యంత్రబలము గలదు. రెండు వత్సరముల క్రింద పోలండుపై యుద్ధము ప్రకటించుటకు ముందు జర్మనులు సోవియటు రష్యాతో నిరాక్రమణ యొడంబడికను గావించుకొని తాము శాశ్వతముగ రష్యాతో స్నేహముగ నుందుమని బాసచేసిరి. అట్టివారు జూన్ 22 వ తేది తెల్లవారు జామున ముందుగ ఏమాత్రమును సూచింపకయే దక్షిణమున రుమేనియానుండియు ఉత్తరమున ఫిన్లండునుండియు కలసి 2,000 మైళ్లు పొడుగుగల సరిహద్దున 50 లక్షల సైన్యముతో ఒక్కమారుగ రష్యాపై బడిరి. ఇట్టిదాడి వచ్చునని రష్యనులు దలంచి యుండకపోవుటచే తమ సైన్యమునంతను సమీకరించి యుంచలేదు. అయినను రష్యనులు జర్మను దాడుల అద్భుతముగ నిలవరింపగల్గిరి. జర్మనులు ఆకస్మికముగ పైబడుటచే మొదటిరోజులలో కొంత వేగముగనే ముందుకు పోగల్గిరి. కాని రష్యనులు సైన్యముల ప్రోగుచేసి తెచ్చి రంగమున నిల్పుచుండుటతో జర్మనుల ఉధృతము తగ్గినది. గత రెండు నెలలలోను జర్మనులు 20 లక్షల సైన్యమును గోల్పోయిరి. 6, 7 వేల విమానములను నష్టపడిరి. 10, 11 వేల టాంకులు సకవచ శతఘ్ని శకటములను గోల్పోయిరి. ఈ విధముగ జర్మనీకిగల సైనికబలము ఆయుధసంపద చాలవరకు శిథిలమైపోయెను.

## బ్రిటను బలం పెరిగింది.

బ్రిటనుయొక్క ఆహార స్థితియు, ఆర్థిక ఆయుధ సంపదయు, ఇదివరకుకంటె చాల అభివృద్ధి పొందెను. బ్రిటనుపై దాడి సాగించుట దుస్సాధ్యమని గత వత్సరము తెలుసుకొనిన తోడనే హిట్లరు బ్రిటనుకు ఆహార పదార్థములను, ఆయుధములను అందకుండ చేయుటకు సముద్ర దిగ్బంధనము చేయవలెననియు, విమాన దాడులవలన దేశమున ఉత్పత్తిని తగ్గించి ప్రజలలో భీతావహము వ్యాపింప చేయవలెననియు తలంచెను. మొదటి రోజులలో జర్మను జలాంతర్గాములు బ్రిటనుకు చాల నౌకా నష్టమును గల్గించినమాట నిజమే. నెలకు షుమారు 3 లక్షల టన్నులకుపై పరిమాణముగల నౌకలు నష్టమగుచుండెను. ఇపుడు పరిస్థితులు మారినవి. గత జూన్ మాసమున బ్రిటిషు నౌకలు విమానములుగలసి 6 లక్షలటన్నుల పరిమాణముగల అక్షరాజ్యముల నౌకల ముంచివేసెను. ఇది బ్రిటిషు నష్టములకంటె రెట్టింపుఅధికము. ఇంతవరకు అక్షరాజ్యములు నౌకాబలమునను వర్తక నౌకలలోను సగ భాగముకంటె యెక్కువగనే కోల్పోయిరి. బ్రిటనుకు, నార్వే, బెల్జియం, గ్రీసు మొదలగు యితర దేశముల తాలూకు 50 లక్షల టన్నుల పరిమాణముగల నౌకలు వచ్చిచేరెను. అమెరికా సంయుక్తరాష్ట్రములు ప్రతి దినమును యింకను క్రొత్త నౌకలకట్టి యొసగుచున్నవి. విమానముల నిర్మించి యిచ్చుచున్నవి. బ్రిటనుకిపుడు జర్మనీకంటె బలవత్తరమగు విమాన దళము గలదు.

జర్మనులు బ్రిటనుపై పగటివేళల విమాన దాడుల సాగించుటలేదు. రాత్రిళ్లైనను చిన్న దాడులమాత్రమే గావింపగల్గుచున్నారు. బ్రిటను అటులగాక, జర్మనీపైకిని, జర్మను ఆక్రమిత ప్రాంతములపైకిని, వందలకొలది విమానములను రాత్రి వేళలయందేగాక, పగటి దాడులకుగూడ పంపుచున్నది.

అమెరికా సంయుక్తరాష్ట్రముల నౌకలుగూడ అట్లాంటికు సముద్రమున గస్తీ ప్రారంభించుటచే, బ్రిటిషు యుద్ధనౌకల భారము చాల తగ్గెను. జర్మను భయములేకుండ అమెరికానుండి బ్రిటనుకు కావలసినంత ఆహారపదార్థములు ఆయుధసామగ్రియు ఇపుడు వచ్చి దిగుచున్నది.

## అమెరికా సహాయం.

వీని యన్నిటికంటెనుగూడ అమెరికా సంయుక్తరాష్ట్రముల వైఖరివలన, మిత్రమండలి విజయము మరింతసుస్థిరమగుచున్నది. సంయుక్తరాష్ట్రములకు కావలసినంత ధన సంపత్తి యంత్రాలయములు నౌకా బలముగలదు. సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము బ్రిటనుకు మొదటినుండియు ఆయుధముల విక్రయించుచునే యున్నది. యిపుడు అరువు కవులు పద్ధతులలో మిత్రమండలికిని అక్షరాజ్యములను ప్రతిఘటించి పోరాడు ప్రతి దేశమునకును కావలసినంత ఆయుధసామగ్రిని సప్లై చేయుటకు వాగ్దాన మొసగెను. సంయుక్తరాష్ట్ర అధ్యక్షుడగు రూజ్వెల్టు యీ నెల రెండవ వారమున చర్చిలు ప్రధానితో సంప్రదించిగావించిన ప్రకటనవలన సంయుక్తరాష్ట్రములు స్వయముగ యుద్ధమునకు వెంటనే దిగకపోయినను అక్షరాజ్యములను తమ శత్రువుగనే పరిగణించి వారి దౌష్ట్యముల రూపుమాపుటకు అన్నివిధములను తాముగూడ మిత్రమండలితో సమానముగ యితర విధముల పోరాటము సాగించుటకు తమ కృతనిశ్చయమును ప్రకటించిరి.

ప్రపంచము లోకెల్ల అన్నివిధములను బలవత్తరములగు సంయుక్తరాష్ట్రములు బ్రిటను, సోవియటు, రష్యాలు యేకమగుచున్నపుడు, అక్షరాజ్యములకు యిక నిలచుటకు నీడయే లభించుట అసంభవము. వానికి విజయాశ అవంతయైనను వుండజాలదు. జర్మనీ బ్రిటనుపై దాడి సాగించు మాటపోయి, బ్రిటనే ప్రస్తుతము జర్మనీపై సైన్యముల నడిపి దాడి సాగింపగల పరిస్థితు లేర్పడినవి.

## ప్రపంచ సంగ్రామమా.

ఇక దూరప్రాచ్యమున అక్షరాజ్యములకు అండగ జపాను వున్నది. జపాను యిటీవల ఇండో - చైనాలో సైన్యముల దింపెను. ఇక థాయి దేశమునగూడ సైన్యముల నిలుపుకొనుటకు హక్కుల గోరుచున్నది. థాయిలాండు స్వాతంత్ర్యమును భంగపుచ్చునెడల తామేమాత్రమును సహింపమని బ్రిటిషు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వములు స్పష్టముగ హెచ్చరించెను. జపాను దురాక్రమణలకు దొరకొనుచో నిరోధించుటకు, సింగపూరు మలయా ప్రాంతములలో కావలసినంత నౌకా బలమును, విమాన బలమును సైన్యమును బ్రిటను నిలపియున్నది. సంయుక్తరాష్ట్ర ప్రభుత్వముగూడ తన నౌకా బలము నా ప్రాంతములకు మార్చుచున్నది. జపాను యింతవరకు సాధించుకొనిన లాభములతో సంతృప్తిచెందియూరకొనిన మంచిది. లేక థాయి దేశముపైనగాని, రష్యాపైనగాని దాడి సాగించుచో బ్రిటిషు ప్రభుత్వముగూడ ఆ దేశములకు సహాయమైన జపానును నెదుర్కొవలసివచ్చును. అపుడది ప్రపంచ సంగ్రామముగ మారును. అమెరికా సంయుక్తరాష్ట్రములుగూడ యీ సంగ్రామమున ప్రవేశింపవలసివచ్చును.

# నాజీ దుర్న్యయములను అంతంచేయుటకు అమెరికా బ్రిటనుల సంకల్పం.

## చర్చిల్ ప్రధాని రేడియో ప్రసంగము:

### రషియాకు సర్వవిధములగు సహాయం చేస్తాం—జాపాను ముప్పు తొలగిపోవాలి.

బ్రిటిషు ప్రధానమంత్రి చర్చిలుగారు అమెరికా అధ్యక్షునితో మాట్లాడివచ్చినపిమ్మట గత ఆదివారంనాడు ప్రపంచమందరికి తెలిసేటట్లుగ రేడియో ఉపన్యాసంచేసిరి. అది 40 భాషలలోకి తర్జుమాచేయబడి అన్నిదేశాలనుండి తిరిగి రేడియోద్వారా ప్రచారం చేయబడింది. వారిట్లు చెప్పేరు:—

"ప్రపంచంలో అత్యంత బలవత్తరమగు దేశం అధ్యక్షుడు రూజువెల్టు. బ్రిటిషు రాజుగారికిని పార్లమెంటుకి సేవకుడనైన నేను యీ క్లిష్టసమయమునందు దేశవ్యవహారముల నడపింప బాధ్యతవహించినవాడనగుటచే బ్రిటిషు సామ్రాజ్యమంతటితరఫున నేను ఆతన్ని చూచితిని. కావున మా ఉభయుల సమావేశం చాల ముఖ్యమైనది. ఈ రెండుదేశాలు ఒకేభాషను మాట్లాడుచు, ఒకే భావములుకలిగి యున్నవి. యూరోపునంతా ఆక్రమించి ఆశియాకుకూడా ప్రాకుచున్న చెడ్డశక్తుల నణచుటకు ప్రపంచంలోని మంచిశక్తులన్నింటిని యీ రెండుదేశములు కూడ దీయుచున్నవి.

"నాజీ దౌష్ట్యంక్రింద యూరోపుదేశములన్నియు నలిగిపోవుచున్నవి." పులివెంట నక్కలవలె ఇటలీ, హంగేరీ, రుమేనియా దేశములు జర్మనీవెనుక నడచుచున్నవి. కాని అవికూడ చివరకు యితర యూరోపు దేశములవలె జర్మనీ కాలుక్రిందపడక తప్పదు. స్వీడను, స్పెయిను, టర్కీ దేశములు తరువాత తమమీదకు నాజీముప్పు వచ్చునేమోనని భయపడుచున్నవి. ఈరీతిగ దేశాలన్ని గోతులో పడుచున్నవి. తిరిగి అందుండి యితరుల సహాయంలేకుండా లేవలేవు. ఇంతటితో హిట్లరు తృప్తిపడక, తాను స్నేహంచేసిన రషియాపైనే లక్షలకొలది సైన్యంపంపి ఘోరయుద్ధంచేస్తున్నాడు. రాజ్యాక్రమణతృష్ణతో అమితగర్వంతో యీ పిశాచి ఇరవై ముప్పైలక్షలమందిని మృత్యువాతపెట్టెను. రష్యాను రూపుమాపేయాలని అతను ఉత్తరవుచేసెను. కాని యీపని అంత సులభంకాదు. ఆర్కిటికు సముద్రంనుండి నల్లసముద్రం వరకుగల యుద్ధరంగంలో 60 లేక 70 లక్షలమంది సైనికులు యుద్ధంచేయుచున్నారు. పాతిక ముప్పైలక్షల నాజీ సైనికులు అపుడే రషియానేలలో కూలిరి. నాజీరక్తం ప్రవాహంగా పారుచున్నది. రషియనులు అతి అద్భుతంగా పోరుచున్నారు. దుర్న్యయం జరుపుచున్న నాజీలకు ఆశాభంగమయ్యెను. ఈరీతిగ శత్రువు లెదురుతిరుగుట వారదివరకెరుంగరు. అందుచే కసికొద్ది రషియను దేశభక్తులను వేలకొలది దారుణహత్యలు చేయుచున్నారు. హిట్లరు టాంకులు పోయినచోటెల్ల కరవుకాటకం ప్రబలుచున్నవి.

### జాపానుప్రాంతాల్లో.

"ఈ క్షోభ యూరోపులోనే కాదు. ఆశియాలో కూడ గలదు. జాపానుకూడ హిట్లరు ముసోలినీలను అనుసరిస్తున్నది. ఐదేండ్లనుండి చీనాలోని 5,000 లక్షల చీనా ప్రజలను జాపాను పీడిస్తున్నది. ఇపుడు దక్షిణ సముద్రంవైపు చేయిచాస్తున్నది. ఫ్రాంసువారిదగు ఇండో-చీనా తీసుకొని, సయాం, సింగపూరు ఫిలిప్పైను దీవులను బెదిరించుచున్నది. ఈ చర్య నిలుపవలసిందే. శాంతియుతమగు ఒడంబడిక జరుగుటకు అన్నిప్రయత్నములు చేయబడును. అమెరికా చాల ఓర్పుతో పనిచేయుచున్నది. జపానుకు ఎట్టి నష్టంకలుగదని హామీయిచ్చును. ఈ రాయబారములు సఫలమగుననియే ఆశించుచున్నాము. కాని విఫలమయినచో మేము నిస్సందేహంగా అమెరికాపక్షము చేరెదము.

### క్రొత్తపద్ధతి ఏమిటి?

"గత యుద్ధాంతంలోవలె యికముందు యుద్ధాలు లేకుండా చేయగలమని ఇంగ్లాండు అమెరికాలు యిపుడు భావించుటలేదు. పైగా నేరంచేసిన రాజ్యాలకు ఆయుధశక్తి లేకుండాచేసి, తగు రక్షణలు మాకు ఉంచుకొని, యికముందు తిరిగి యిట్టి దుర్న్యయములు జరుగకుండునట్లు శ్రద్ధవహించెదము. 1917 లో వలె యిపుడు జర్మనీవర్తకం నాశనం చేయదలచుకోలేదు. ఒక పెద్దదేశం ఎట్టి అభివృద్ధిలేకుండా బ్రతకడానికి కష్టంగానుండడం మాకే మంచిదికాదు. ఈ విషయం అన్నిదేశాలు బాగా ఆలోచించాలి. హిట్లరూ అతని అనుచరులును తామాక్రమించిన దేశాలను పీడించుచు, వాటి సంపదను కొల్లగొట్టుచు, తాము చెప్పినట్లు అవన్ని వినాలని నిర్బంధించుచున్నారు. అదియే వారు సూచించిన యూరోపులోని క్రొత్త పద్ధతి—నూతన వ్యవస్థ. ఇది ప్రపంచమంతా వ్యాపింపజేయాలని వారికి దురాశగావుంది. జర్మను జాతి అన్నిజాతులకన్న గొప్పదని, తక్కిన జాతులన్నింటిని నిరంకుశంగా పాలించజూచుచున్నది. ఇపుడు డజను దేశాలను ఆయుధబలంచేత ఆప్రకారం అణచియుంచగల్గెను. ఓడిన దేశాల కష్టాలు ఎక్కువకాలం ఉండవచ్చును కాని ఎల్లకాలం ఉండవు. గుహలోని మార్గం చీకటిగ నుండవచ్చును, గుహ చాల నిడుపైనది కావచ్చును. కాని చివరకు వెలుతురుండును. మా అట్లాంటికు సమావేశం ఆ వెలుతురునే చూపుచున్నది.

### నిరాశ చెందవద్దు.

"ధైర్యస్థులగు నార్వే ప్రజలారా! మీదేశంనుండి విదేశీయులనేకాక, దేశద్రోహులగు క్విస్లింగులనుకూడ తరిమివేతుము. జక్కులారా! మీ స్వాతంత్ర్యం తిరిగి బడయగలరు. పోలండు దేశీయులారా! మీ సైనికుల ధైర్యం త్యాగం మరువబడదు. మీ దేశం తిరిగి యూరోపు పునస్సృష్టిలో తగు స్థానం ఆక్రమింపగలదు. ఫ్రెంచివారు తలయెత్తి తిరుగవచ్చు. మీ లావెలు డార్లనుల నీచ చర్యలు మీరు స్వాతంత్ర్యం బడయుటకు అడ్డురావు. డచ్చి, బెల్జియం, గ్రీసు, యుగోస్లావు దేశీయులారా లొంగిపోకండి, మీ ఆత్మలను నాజీలకు ఒప్పగించకండి. వారిని సంఘ బహిష్కృతులుగ, జాతివెలిబడ్డవారిగా చూడండి. మీకు అమితమగు సేనల సహాయం వస్తున్నది. నమ్మియుండండి. మీకు దాస్యవిముక్తి చేకూరగలదు. నాజీదుర్న్యయం పూర్తిగ తుదముట్టించుటకు అమెరికా బ్రిటనులు అట్లాంటికు ఒడంబడిక గావించుకొని, కంకణం కట్టుకొన్నవి."

అని చర్చిలుగారు ఓడిన దేశాలన్నింటికి ధైర్యం చెప్పిరి. అమెరికాపై హిట్లరు యింకను కత్తిదూయకుండుటకు కారణం అమెరికాపై ప్రేమచేకాదు, రెండు మహాదేశములను ఒకేసారి ఎదుర్కోలేనను భయమే. ప్రమాదంలోనున్న దేశాలన్ని జాతిసమితి సూత్రాల ననుసరించి ఒక సంఘంగా ఏర్పడమని మూడున్నర ఏండ్ల క్రిందటనే తాను హెచ్చరించియుండగా, ఎవరు లక్ష్యంచేయలేదనియు, యీలోగా జర్మనీ సైన్యాన్ని వృద్ధిచేసి దారుణచర్యలకు గడంగెననియు చెప్పిరి. ఒక దాని తరువాత నొకటిగా అన్ని దేశాలను కబళించెను. చివరకు తన

మిత్రముగానుండిన రష్యానే ఎదుర్కొనెను. రష్యాకు అన్ని విధములగు సహాయముచేయ అమెరికా ఇంగ్లాండులు నిశ్చయించినవి. కార్యవిధానం నిర్ణయించుటకు మాస్కోలో త్వరలో మూడు రాజ్యాల ప్రతినిధుల సభ ఏర్పాటుచేసితిమి. అమెరికా ప్రజలకు బ్రిటిషు ప్రజలకుగూడ వ్యాపించిన ప్రమాదమును సమయం మించిపోకుండానే అమెరికా అధ్యక్షుడు పూర్తిగ గుర్తించినందుకు కృతజ్ఞులము. ఎనిమిదేండ్ల క్రిందటనే అతడు తమ నౌకాదళమును దిద్దుబాటుచేసెను. అది లేకుండినచో అమెరికాకూడ యీ సరికి యూరోపు నియంతల చెప్పుచేతుల క్రిందికివచ్చేది. ఇపుడా శక్తితో అమెరికా ప్రపంచమంతకు అసాధారణముగ సహాయముచేయనున్నదని, చర్చిలుగారు కొనియాడిరి.

బ్రిటను రక్షణ యంత్రములలో నొకటి.



ఈ 12 అంగుళముల ఫిరంగులు రైలుబండ్లమీద ఎక్కించి యుంచబడును. ఇవి బ్రిటనుకు కాపాడు గొప్ప సాధనములు. టన్నులో మూడవవంతు బరువుగల గుండ్లు వీటిలో ఉపయోగింపబడును. ఇవి ఉపయోగమునకు ఎల్లప్పుడును సిద్ధముగా నుంచబడుచున్నవి.

# ఇరాన్ను బ్రిటిషు సేనలు రషియా సేనలు ఆక్రమించెను.

## రషియా, ఇరాను, ఇండియాల క్షేమంకొరకే.

### ఇరాను దేశ ప్రాముఖ్యత.

[ఆదివరకు పెర్షియా అనబడు దేశాన్ని ఇపుడు ఇరాను అంటారు. దీని వైశాల్యం 6,28,000 చదరపు మైళ్లు. దీనికి ఉత్తరమున రషియా, తూర్పున ఆఫ్గనిస్తాను ఇండియాలు, దక్షిణమున పెర్షియనుగల్ఫు అరేబియా సముద్రములు, పడమరను ఇరాకు టర్కీ దేశములుగలవు. జనసంఖ్య 15,000,000. అందెక్కువమంది షియా తెగకుచెందిన ముస్లిములు. రాజాఖాను పెహ్లవియనుషా పరిపాలించుచున్నాడు. ఈ దేశంలో అందరికి నిర్బంధంగా సైనిక శిక్షణ యిస్తారు. చమురు ఎక్కువగా వుండే దేశాలలో ముఖ్యమయినది. సాలుకి 100 లక్షల టన్నులను తయారుచేయు ఆంగ్లో-ఇరానియను ఆయిలు కంపెనీయందు బ్రిటిషువారి పెట్టుబడియెక్కువ. ఇరాను వ్యాపారం 100కి 40 వంతు రషియాతో. జర్మనీ, ఇంగ్లాండు అమెరికాలతో వ్యాపారం అంతకన్న తక్కువగనుంది. ఉక్రేన్ను ఆక్రమించినపిమ్మట కాకసను ప్రాంతంనుండి పెర్షియాలోనికి సైన్యాలనుదింపి సిరియా, ఇరాకు ఇండియాలపై బడవలెనని హిట్లరు తలపెట్టెను. అట్లు జరుగకుండుటకై బ్రిటిషు రషియా సేనలు యీ దేశం ప్రవేశించినవి.]

కొన్ని నెలలనుండి ఇరానులోనికి జర్మనులు అనేక వేలమంది క్రమేణ ప్రవేశిస్తున్నారు. వారు దేశంలో ముఖ్యమైన పరిశ్రమలన్నింటిలో పనివారుగచేరిరి. వారు జర్మను రాయబారి ఆదుపు ఆజ్ఞలలోనుండి, జర్మనీకి అనుకూలంగా కుట్రలు పన్నుచున్నారు. ఇరాను ప్రజలను భీతికలిగిస్తున్నారు. దేశంలో ఆహార పదార్థాలన్ని తమ దేశం పంపించి, జర్మను ప్రభుత్వం చెప్పుచేతులలో ఇరాను ప్రభుత్వం ఉండునట్లు చేయుటే యీ జర్మనుల ఉద్దేశం. వీరు రహస్యంగా మందుగుండుగూడ తయారుచేస్తున్నారు. దేశీయులకు సైనిక శిక్షణ ఒసంగుతున్నారు. ఈ జర్మను గూఢచారులవలన చాల ప్రమాదంగలదు. వారిని తరిమివేయాలని ఇరాను ప్రభుత్వమును రషియా-ఇంగ్లాండు ప్రభుత్వములు జూలై 26 నుండి ఆగస్టు 16 లోగా మూడు సారులు అప్పుడే హెచ్చరించియుండెను. జర్మనులను తరిమివేయకుంటే రషియా ఇంగ్లాండులకేగాక ఇరానుకుగూడ చాల మోసం జరుగునని స్పష్టంగా తెలుపబడెను. అయినా ఇరాను ప్రభుత్వం లక్ష్యంచేయక జర్మనులను తాము అణచియుంచగలమని బదులుచెప్పెను.

అందుచే గత సోమవారంనాడు ఉత్తరమునుండి రషియా సేనలును, దక్షిణం-పడమరలనుండి బ్రిటిషు సేనలు భారతీయ సేనలును ఇరానులో ప్రవేశించినవి. బ్రిటిషు, ఇండియను

సేనలు కాంకిను, కోరాంషహరు, అబడీను అను మూడు పురములందు ప్రవేశించినవి. ఆఖరుచోట కొంచెంగా ఇరాను సేనలు ఎదిరించినవి. విమానదళం, నౌకాదళంకూడ బ్రిటిషు సేనకు తోడ్పడెను.

ఏడు శత్రునౌకలను నావికులతోగూడ భారతీయ సేనలు వశపరచుకొన్నవి. ఈ చర్యయందు ఇరాను ప్రజల కెక్కువ నష్టం కలుగకుండా శ్రద్ధవహించబడెను. రష్యా సేనలు ఉత్తరమున రెండు వైపులనుండి ఇరానులో 20 మైళ్లలోపు వరకు ప్రవేశించి, టబ్రిజు నగరం వరకు వచ్చినవి. టబ్రిజు రష్యావారిదగు బాకునుండి, ఇరాను ముఖ్యపట్నమగు టెహరానువరకుగల రైలుమార్గమున మధ్యగ నున్నది. నూనె గనులను వశపరచుకొని, అందు పనిచేయువారి రక్షణకై విమాన సేనలు పంపబడినవి.

### ఆక్రమించుటకు కారణాలు.

జర్మనులు రష్యాతో యుద్ధంచేయుచున్నారు. కాకసను ప్రాంతంద్వారా ఇరాను ప్రవేశించి, అచట కేంద్రస్థానమేర్పరచుకొని పడమర-దక్షిణ దేశాలపై దాడిచేయాలని హిట్లరు సంకల్పం. ఇరానులో బ్రిటిషువారికి ప్రతికూలమగు అరబ్బులు చేరుచున్నారు. బ్రిటిషువారి సేనకు అవసరమగు చమురుగనులు యిక్కడ ఉన్నాయి. ఇరానులో నాజీ కుట్రదారులుండడం చుట్టునున్న ముస్లిమురాజ్యాలగు ఇరాకు, సిరియా, ఈజిప్టు, అరేబియా, ఆఫ్గనిస్తానములకు మోసం; అంతేకాక ఇండియాకు పీకమీద కత్తివంటిది. ఇరానులో సైనికచర్యలన్నీ ఇండియా సేనాధిపతియగు సర్ ఆర్చిబాల్డు వావెలుగారి నాయకత్వమున జరుగుచున్నవి. ఇరాను దేశభాగాలను ఆక్రమించే దురాశ రష్యా - ఇంగ్లాండులకు లేదు. జర్మనీ ఆ దేశాన్ని ఆక్రమించి రషియాను యింకను చిక్కులలో పెట్టకుండాను, మధ్యప్రాచ్యదేశాలు ఇండియాలను బెదరించకుండాను, చమురుగనులు జర్మనుల చేతిలో పడిపోకుండాను చేయుటకే ఇరాను ఆక్రమించబడింది. ఆ విషయమంతా వివరంగా బోధపరచుచు వేలకొలది కరపత్రములు టెహరాను నగరంలో విమానాలద్వారా పడవేయబడెను. ఇరానులో చేరిన జర్మనులు, కుట్రలుపన్ని దేశద్రోహులను ప్రోత్సహించి, చివరకు యూరోపులో ఇతర దేశాలను ఆక్రమించినట్లే ఆక్రమించి, ఇరాను ప్రజలను బానిసలుగా చేతురనియు, వారిని తరిమివేయుటకే రష్యా ఇంగ్లాండు సేనలు ఆదేశం చేరినవనియు, ఆ కరపత్రముల ద్వారా తెలుపబడింది.

అమెరికాకు ఇతర తురుష్క దేశాలకుగూడ యీ ఉద్దేశములు కారణములు ఇంగ్లాండు-రష్యాలు తెలియజేసినవి. ఇపుడు టర్కీకి జర్మనీవలన భయం తొలగిపోయింది. ఇరానుకి కావలసిన ఆహారపదార్థములనుగూడ నాజీలు దొంగలింపగా, భారతీయ సేనలు తమదేశంనుండి 60,000 టన్నుల గోధుమలు తెచ్చియిచ్చినవి.

### రష్యాకు సహాయం.

ఇరాను ఆక్రమణంవలన బ్రిటిషు అమెరికా దేశములనుండి అన్నివిధములగు సహాయం రష్యా దేశానికి కాకసు రాష్ట్రంద్వారా చేరగలదు. ఇరాను ప్రభుత్వం ఎన్నిమారులు చెప్పినా విననందున యీరీతిగ బుద్ధిచెప్పవలసి వచ్చింది. టెహరానులోనున్న షా ప్రభుత్వంవారు రష్యా బ్రిటిషు ప్రతినిధులతో యిప్పటికిని సంప్రదించుచునే యున్నారు. అమెరికా, ఇండియా, ఇంగ్లాండు, సామ్రాజ్యదేశాలు అన్నింటిలోని పత్రికలు యీ ఆక్రమణ చర్యను కొనియాడినవి. "ఇది రాజ్యాక్రమణ కాదు, ఇరానుకి సహాయం చేయడం. ఇరాను ప్రభుత్వం స్వయంగా తొలగించుకోలేని, తొలగించుకోనొల్లని ప్రమాదాన్ని తొలగించడం".

### యుద్ధమాగింది.

షా రాజుగారు బ్రిటిషు - రష్యా సైన్యముల నెదుర్కొనుట వల్ల లాభంలేదని, జననష్టం కల్గునని యుద్ధమాపివేసెను. ఆలీమున్సూరుగారి మంత్రాంగము రాజీనామా నిచ్చెను. మలీఫెరూఘిగారు మంత్రాంగమును నిర్మించారు. ఈ క్రొత్త ప్రధాన మంత్రిగారు యుద్ధమాపమని తన సైన్యాలకు ఉత్తరువువేశారు. ఇరాకు ప్రభుత్వము యితర రాజ్యములతోను చుట్టుప్రక్కల రాజ్యములతోను స్నేహభావముననుండవలెనని తలచుచున్నట్లు క్రొత్త ప్రధాని పార్లమెంటునకు తెలిపెను. ఈ వార్త బ్రిటనుదేశములో హర్షము కలిగించెను. ఇంగ్లాండునకుగాని రష్యాకుగాని ఇరానులో రాజ్యము సంపాదించవలెననే ఉద్దేశము లేదు.

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమానదాడులు.

20 వ తేది బుధవారం మధ్యాహ్నము, రాత్రి వందల కొలది బ్రిటిషు విమానములు హాలండు, బెల్జియం ఆక్రమిత ఫ్రాన్సు దేశములపైకి దాడివెడలి శత్రువిమానాశ్రయములపై చాల బాంబుల వర్షించినవి. ఆల్కునారు (హాలండు) నందలి శత్రువిమానాశ్రయము పూర్తిగ ధ్వంసమైపోయెను. ఈ పోరాటములలో 3 శత్రువిమానములు ధ్వంసమయ్యెను. 2 బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. నాటిరాత్రి రష్యను విమానములు బర్లిను నగరంపై తీవ్రమగు విమానదాడిజరిపెను. 21 వ తేది మధ్యాహ్నం ఇజ్బ్రాదిక్ పట్టణము (ఉత్తర ఫ్రాన్సు) నందలి ఇనుము కర్మాగారములపై వందల కొలది బాంబులు వర్షింపబడెను. శత్రు విమానాలతో పోరాటమున ఒక శత్రు విమానం రెండు ఈ బోటులు నిర్మూలింపబడెను. 14 బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. 22 వ తేది రాత్రి జర్మనీ పడమటి భాగమందలి పారిశ్రామిక పట్టణములమీద, అందు ముఖ్యముగ మాన్‌హీం మీద—తీవ్రమగుదాడి సాగించెను. లీహావ్రే, ఓస్టెండు, డంకర్కు మొదలగు ఫ్రెంచి తీరపు రేవులపైనగూడ చాల బాంబులు వర్షింపబడెను. పోరాటమున 2 శత్రు విమానములు పడగొట్టబడెను. వాతావరణం అనుకూలంగా లేకపోవుటచే 23 వ తేదిన విశేషంగా దాడులు సాగించలేదు. 24 వ తేదినగూడ వాతావరణంలో ఎక్కువ మార్పులేదు. అయినను బ్రిటిషు విమానములు జర్మనీయందలి డస్సెల్డార్ఫు, మొదలగు పారిశ్రామిక పట్టణములపైకివెళ్లి వానిపై అగ్నివర్షం కురిపించివచ్చినవి. ఈ దాడులలో నాల్గు విమానములు తిరిగిరాలేదు.

20 వ తేది బుధవారం రాత్రి బ్రిటనుపై విమానదాడులు లేనేలేవు. ఒక్క జర్మను విమానం మాత్రంవచ్చి తూర్పు ఆంగ్లియాలో ఒకచోట ఒక్క బాంబువేసి వెళ్లిపోయింది. ఆ బాంబుకూడా, ఏవిధమైన నష్టమును కలిగించలేదు.

22 వ తేది రాత్రి స్వల్పంగా శత్రువిమానాలువచ్చి తూర్పు తీరపు పట్టణములలో అచ్చటచ్చట కొన్ని బాంబులు వేసినవి. లోపలి ప్రాంతాలకు విమానాలు రానేలేదు. తీరపు ప్రాంతాలలోగూడ రాత్రి 12 గంటల తరువాత ఆ దాడులు ఆగిపోయినవి. ఈ దాడిలో ఒక శత్రు విమానం పడగొట్టబడింది.

### ఆఫ్రికా మధ్య ధరా.

అబిసీనియాయందు ఇంకను-ఇటాలియనుల స్వాధీనమున నున్న అజోజో పట్టణముపైనను అచటి విమానాశ్రయము

పైనను బ్రిటిషు విమానములు 21 వ తేదిన పెద్ద దాడి సాగించి విమానాశ్రయమును శిథిలపరచెను.

23 వ తేదిన టోబ్రూకు దుర్గమువద్ద (ఉత్తర ఆఫ్రికా) శత్రుపదాతి దళము, దుర్గముపైకి చొచ్చుకొనివచ్చుటకు ప్రయత్నించెను. కాని దుర్గమునందలి ఫిరంగులు, శత్రులపై అగ్నివర్షము కురిపించి చెల్లాచెదరుగావించెను. లిబియా—ఈజిప్టు సరిహద్దులందుగూడ ఆ రోజున స్వల్పముగు పోరాటము సాగెను.

21, 22 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు ఇటాలియనుల ట్రిపోలీ రేవుపై వందలకొలది బాంబుల వర్షించెను. రేవును అందున్న నౌకలలో చాలభాగమును ధ్వంస మొనర్ప బడెను. 23 వ తేది రాత్రి బ్రిటిషు విమానముల దాడులను మరింత హెచ్చించి, ట్రిపోలీ రేవుపైన 20 టన్నుల బాంబులను గుప్పించెను. రేవులో వున్న నౌకలలో మూడు ముంచివేయ బడెను. ఆ రేవునందు లేచిన మంటలు 130 మైళ్లవరకు కనుపించుచుండెను.

20 వ తేదిన సూయజు కాలువ ప్రాంతముపై శత్రు విమానములు మరల దాడి జరిపెను. ఆస్తికి స్వల్పంగా నష్టం కలిగింది. ఇద్దరు మరణించిరి, 28 మందికి గాయములు తగిలెను.

21 వ తేది గురువారము నాడు జర్మను విమానములు సైప్రెస్ దీవియందలి ఫామగుస్టా పట్టణముపై దాడి జరిపెను. ప్రజలలో కొందరు మరణించిరి. ఆస్తికిగూడ కొంత నష్టము గలిగెను.

## అమెరికా-అట్లాంటిక్.

అమెరికా సంయుక్తరాష్ట్రములలో ప్రధానమగు పత్రికలలో నొకటియగు "న్యూరిపబ్లిక్" పత్రిక ఆక్సిసురాజ్యములపై వెంటనే యుద్ధమును ప్రకటింపవలసినదని రూజ్వెల్టు అధ్యక్షుని హెచ్చరించెను.

పశ్చిమార్ధ గోళమందలి అట్లాంటికు మహాసముద్ర ప్రాంతమున సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ యుద్ధ నౌకలు గస్తీ తిరుగు చుండుటవలన క్రమముగా ఆక్సిసు జలాంతర్గాము లభయము తొలగింపబడుచున్నదని జోసెఫ్ డిస్కోలుగారు న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యూనునందు వ్రాసిరి.

అవసరమగుచో రష్యాకు ఆయుధ సామగ్రికొరకు ఋణ మొసగుటకు గూడ సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము సిద్ధముగ నున్నదనియు ఋణముల శాఖాధికారియగు జోసెపు జోన్సుగారు ప్రకటించిరి.

## రష్యా.

రష్యా ఉత్తర రంగమున, రష్యను సైన్యముల నాయకుడగు వరషిలావ్ సేనాని 20 వ తేదీన, లెనెన్‌గ్రాడును, యెన్నటికిని శత్రువశం కానీయకుండ పోరాడవలెనని పురజనుల నుద్బోధించెను. 10 లక్షల ప్రజలు నగరమును కాపాడుటకు సిద్ధముగ నుండిరి. 24 వ తేదికి జర్మను సైన్యములు లెనిన్‌గ్రాడునకు 20 మైళ్లలోనికి వచ్చిరి.

మధ్య రంగమునుండి (స్మోలెన్‌స్కు) జర్మను సైన్యములు ఆగ్నేయదిశగా నడచి గోమెల్ అను దుర్గమును 21 వ తేదీన స్వాధీనపరచుకొన్నవి. స్మోలెన్‌స్కు రంగమునకొనీవు సేనాని (రష్యను) సైన్యములు జర్మను సైనిక పంక్తుల భేదించి తిరిగి 9 గ్రామములను పట్టుకొనెను.

నీపరునది నల్ల సముద్రమున ప్రవేశించు ప్రదేశమున గల కెర్సన్ రేవును తాము ఆక్రమించితిమని జర్మనులు 20 వ తేదీన ప్రకటించిరి. యుక్రేన్ రాష్ట్రమును కాపాడుటకు నియమింపబడిన బుడెన్నీ సేనాని, తన సేనలలో చాల భాగమును, నీపరునదికి తూర్పు ప్రాంతమునకు సురక్షితముగ చేర్చెను. ఒడెస్సారేవు పట్టణమున నిలచియున్న 66 వేల రష్యను సైన్యం తుదివరకును పోరాడుటకు నిశ్చయించుకొనిరి.

నీపరునది తూర్పు తీరమున గల నీప్రో—పెట్రోవాస్కీ అను గొప్ప పారిశ్రామిక పట్టణమును పట్టుకొంటిమనియు దీనితో నీపరు తూర్పు ప్రాంతమంతయు తమ స్వాధీనమయ్యెననియు జర్మను అధికారులు ప్రకటించిరి.

గత రెండు నెలల యుద్ధములో జర్మనులు 20 లక్షల సైనికుల గోల్పోయిరని రష్యను అధికారులు దెలుపుచున్నారు.

రష్యాకు వెంటనే సహాయమంపుటకు సకల ప్రయత్నములు గావింపబడునని చర్చిలు ప్రధాని ప్రకటించెను.

## టర్కీ-ఇరాక్-ఈరాన్.

బల్గేరియా దక్షిణ ప్రాంతమునను, సామోస్ దీవి యందును ఇటాలియనులు,జర్మనులు సైన్యముల కేంద్రీకరించిరి.

టర్కీ ప్రభుత్వము, జర్మనీయెడల నమ్మకద్రోహముగ వ్యవహరించుచున్నదని, జర్మనీ పత్రికలు 20 వ తేదిన ప్రచారము ప్రారంభించెను. జర్మనీయందలి, టర్కీ ప్రభుత్వ రాయబారి, యుద్ధ రంగమునందున్న హిట్లరును దర్శించి, ఉభయదేశములకును గల పరస్పర అనుమానములగురించి చర్చించెను.

20 వ తేదిన ఈరాన్ రాజగు "షా", రాజధానియగు టెహరన్ పట్టణమున సైనికోద్యోగుల కళాశాల పట్టప్రదానోత్సవమున కధ్యక్షతవహించుచు, ఈ సంవత్సరము మామూలు సెలవు లొసగబడవని ప్రకటించెను. దేశరక్షణకు సమస్త త్యాగములను గావించుటకు సిద్ధముగ నుండవలెనని ప్రబోధించెను.

ఈరాన్‌నందలి జర్మనులను వెడలగొట్టవలెనని బ్రిటిషు-రష్యా ప్రభుత్వములు 16 వ తేదీన అందజేసిన జాబునకు ఈరాన్ ప్రభుత్వము 21 వ తేదిన వ్రాతపూర్వముగ సమాధానమొసగెను. ఆ సమాధానమున—ఈరాన్‌నందలి జర్మనుల వెడలుగొట్టుటకు ఈరాన్ ప్రభుత్వము అంగీకరింపలేదు.

25 వ తేది ఉదయము బ్రిటిషు ప్రభుత్వమువారు, తమ సైన్యములను ఈరాన్‌పైకి నడిపించిరి. అదే సమయమున కాకసస్ ప్రాంతమునుండియు, కాస్పియన్ సముద్రమునకు తూర్పు వైపుననుండియు రష్యను సైన్యములు సరిహద్దులదాడిగూడపర్షియా నాక్రమించుటకుప్రారంభించెను.

## నౌకా నష్టములు.

జూలై మాసమునను, ఇంతవరకు ఆగస్టు మాసమునను బ్రిటిషు నౌకా నష్టములు ఇదివరకు కంటె చాల తగ్గెనని బ్రిటిషు నౌకాశాఖ మంత్రియగు వి. వి. అలెగ్జాండరుగారు ప్రకటించిరి.

22 వ తేదిన అట్లాంటికు మహాసముద్రమున జర్మను జలాంతర్గామి, ఒక బ్రిటిషు వర్తక నౌక నెదిర్చెను. రెంటికిని జరిగిన పోరాటమున వర్తక నౌక శత్రు జలాంతర్గామిని ముంచి వేసెను.

బ్రిటిషు ప్రభుత్వపక్షమున నిపుడు 190 మిత్రమండలి యుద్ధ నౌకలు పోరాడుచున్నవనియు, వానిలో 50 నౌకలు ఫ్రెంచివారివనియు, బ్రిటిషు నౌకా మంత్రి వి. వి. అలెగ్జాండరుగారు వెల్లడించిరి. ఇవిగాక, ఈ క్రింది దేశముల తాలూకు వర్తక నౌకలుగూడ బ్రిటిషుప్రభుత్వ స్వాధీనమునుండి పనిచేయుచున్నవి. డచ్చివారివి 480 నౌకలు (2,250,000 టన్నులు); నార్వే 720 నౌకలు (3,250,000 టన్నులు); ఫ్రెంచి 92 నౌకలు (400,000 టన్నులు); బెల్జియను 54 నౌకలు (200,000 టన్నులు); గ్రీకులు 240 నౌకలు (1,000,000 టన్నులు); పోలండు 32 నౌకలు (100,000 టన్నులు.)

25 బ్రిటిషు నౌకల జట్టు యొకటి జిబ్రాల్టరునకు పోవుచు స్పెయినునకు పడమటగా అట్లాంటికు మహాసముద్రమున ప్రయాణ మొనర్చుచుండగా శత్రువిమానములును, జలాం

తర్గామియు యెదిర్చెను. 7 నౌకలు ముంచివేయబడెను. 18 నౌకలు సురక్షితముగా టాగస్ రేవులో చేరినవి.

20 వ తేదిన బ్రిటిషు విమానమొకటి నార్వే ప్రాంతమున ఒక జర్మను స్లైపె నౌకను ముంచివేసెను.

## దూరప్రాచ్యము.

పసిఫిక్ మహాసముద్రమున క్రొత్తగా కనుగొనబడిన దీవులను జపాను ఆక్రమించుకొనుచో—తాము అంగీకరింపమని సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము తెలియజేసెను.

జపానునందలి అమెరికనులను స్వదేశమునకు మరలివచ్చుటకును, సంయుక్తరాష్ట్రములందలి జపానీయులు స్వదేశమునకు మరలి వెళ్లుటకును ఏదో యేర్పాటుగావింపబడునని సంయుక్తరాష్ట్రముల దేశీయాంగమంత్రి హల్లుగారు నుడివిరి.

జపాను - అమెరికా సంబంధములు చాల విషమములగుటచే, యెట్లయినను వానిని పరిష్కరించుకొనుటకు ఉభయ పక్షముల ప్రతినిధులును, అమెరికాలో 15 పర్యాయములు సమావేశమై సంప్రదింపులు జరిపిరి. జపాను తన వైఖరిని మార్చుకొనిననేగాని, సమాధానావకాశములు గన్పింపవని సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వమువారు తెలియజేసిరి.

తాయిదేశముపై తమకు దురాక్రమణవాంఛలు లేవని బ్రిటిషు ప్రభుత్వము ప్రకటించినటులనే జపానుగూడ యెందుకు ప్రకటించుటలేదని తాయి పత్రికలు ప్రశ్నించుటకు ప్రారంభించినవి. బ్రిటిషు ప్రభుత్వము మలయాలో తాయి దేశపు సరిహద్దులయందు సైన్యముల కేంద్రీకరించినను తాయి ప్రభుత్వము ఆప్రాంతమున రక్షణ యేర్పాటుల గావింపలేదనియు, జపాను సైన్యములున్న ఇండో-చైనావైపుమాత్రము సైన్యముల కేంద్రీకరించుచున్నదనియు ఈ విచక్షణకు తాయి ప్రభుత్వము సమాధానమొసగవలసియుండుననియు, జపాను పత్రికలు వ్రాయుచున్నవి.

ఇండో-చైనాలో ఉత్తరభాగమునుండి జపాను విమానములు, చైనా ఆగ్నేయప్రాంతపు పట్టణములపై విమానదాడుల నధికమొనర్చెను. 20 వ తేది బుధవారమునాడు 30 జపాను విమానములు బర్మా-చైనా రోడ్డునందలి వేర్వేరు ప్రదేశములపైనను, లియుచో, కున్మింగు పట్టణములపైనను బాంబుల వర్షించెను. 22 వ తేదిన 135 జపాను విమానములు చైనా రాజధానియగు చుంకింగు నగరముపై వందలకొలది బాంబుల వర్షించెను. 23 వ తేదిన 108 విమానములు మరల చుంకింగుపై యెత్తివచ్చి బాంబుల వర్షించెను. చుంకింగు విశ్వవిద్యాలయమునకు బాంబుదెబ్బలుతగిలి శిథిలమయ్యెను.

సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వము రష్యాకు పంపదలచిన ఆయుధసామగ్రిని, పెట్రోలు మొదలగువానిని వ్లాడివాస్టక్ రేవున దింపినయెడల జపానుసహింపదనియు, అట్టిసందర్భమున యుద్ధము సంభవించునెడల అందుకు సోవియటు రష్యాయే బాధ్యత వహింపవలసియుండుననియు జపాను పత్రికలు హెచ్చరించెను. 26 వ తేదిన రష్యా ప్రభుత్వము జపాను రాయబారికి సమాధానమొసగుచు, వ్లాడివాస్టక్ రేవున ఆయుధసామగ్రిని దిగుమతిచేసుకొనుటకు రష్యాకు పూర్తియగు హక్కుగలదనియు, ఆ సరకుల రవాణాకు జపాను అడ్డుతగులునెడల దానిని శత్రుచర్యగ పరిగణించెదమనియు ప్రకటించెను.

## విషీ.

విషీ (ఫ్రెంచి) ప్రభుత్వము, జర్మనీతో సంధి యొడంబడికను గావించుకొనుటకు సంప్రదింపులు సాగించుచున్నటుల బలమగు వదంతులు వ్యాపించియున్నవి.

పెటెయిను సేనాని అధ్యక్షతను విషీ మంత్రివర్గము 23 వ తేదిన రెండు సార్లు సమావేశమై, దేశీయవ్యవహార పరిస్థితుల చర్చించిరి. రైల్వేలలోను, కర్మాగారములందును "ద్రోహులు" పనుల భగ్నపరచుచున్నారనియు, అట్టివారి నణచుటకు కఠినమగు చర్యలు గైకొనబడుననియు విషీ దేశీయాంగమంత్రి హెచ్చరించెను.

పారిసునందు 1,000 మంది "కమ్యూనిస్టు" లనియు ద్రోహచర్యలకు కారణులనియు అనుమానముపై నిర్బంధమునందుంచబడిరి. జర్మను సైనికోద్యోగులలో నొకరు హత్య చేయబడుటచే ఈ చర్యగైకొనబడెననియు, ఇకమీద అట్టి హత్యల జరుపుచో—నిర్బంధమునందుంచబడిన వారిలో కొందరు తుపాకిచే ప్రేల్చివేయబడుచుందురనియు జర్మను అధికారులు ప్రకటించిరి.

ఫ్రాన్సునందు, జర్మను ఆక్రమణపైనను, విషీప్రభుత్వముపైనను తిరుగబాటులు దౌర్జన్య చర్యలు హెచ్చుచున్నవి. మాజీ ఫ్రెంచి ప్రధానమంత్రియు, జర్మనీతో సహకారవాదియు అగు పీరీలావలుగారును, పారిసు నగరమున విషీ ప్రభుత్వరాయబారియగు డిబ్రినన్‌గార్లును, సోషలిస్టు పక్షనాయకుడగు మార్సెలుడీట్‌గారును-వర్సెయిల్సునందు-రష్యాపై యుద్ధమునకు వలంటీయరు దళమును పంపు సభయందున్నపుడు యెవరో, వారిపైన తుపాకులు ప్రేల్చిరి. లావెలు డీటుగార్లకు చాల గాయములు తగిలి ప్రమాదావస్థయందున్నారు.

## ఆక్రమిత ప్రాంతములు.

"జర్మనీకి ప్రతికూలముగ మాటలాడినయెడల వురితీయబడుదురు." అని ఫ్రాన్సునందు జర్మను లాక్రమించియున్న అల్సాసు జిల్లాలో జర్మను అధికారి ప్రకటించెను. ఆ జిల్లాలో జర్మను భాష తెలిసినవారు ఫ్రెంచి భాషలో మాటలాడినయెడల ఒక సంవత్సరము కారాగార శిక్ష విధింపబడునని గూడ అతడు ప్రకటించెను.

'గొరిల్లా' పద్ధతులలో శత్రులగు నాజీలతో నింకను పోరాడుచున్న 180 మంది యుగోస్లావు వీరులను పట్టుకొని వురితీసిరి.

బెల్జియములోగూడ ప్రజలు, జర్మను ఆక్రమణ అధికారులపై తిరుగబాటుల సాగించుచున్నారు. అధికారులు వారిని అణపజాలక సైన్యములను సహాయమునకు పిలువవలసివచ్చుచున్నది.

## తటస్థ దేశములు.

ఐరోపాఖండమున స్విట్జర్లండు, స్వీడను దేశములు రెండును, ఇంకను ఆక్సిసు రాజ్యములు ఐరోపాలో నెలకొల్పనున్న "నూతన వ్యవస్థ" యందు చేరుట కుత్సాహము గన్పరుపనందుకుగాను జర్మను పత్రిక లా దేశములపై తీవ్రమగు ప్రతికూల ప్రచారమును ప్రారంభించినవి.

అర్జెంటైనా (దక్షిణ అమెరికాలో) లో అధికారులు ఆ దేశమునగల నాజీలలో 38 మంది నాయకులను అరెస్టు చేసిరి.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.